శ్రీ

# రామయాజిచరిత్రము.

ఇయ్యది

శ్రీమద్రాజమహేంద్రవరములో

మహారాజశ్రీ

శ్రీ రంమమూర్తి శ్రీ వెంకట సీతారామచంద్రరావు

ఒపస్టర్ జమీన్‌దారువారి

ఇండస్ట్రియల్ జనానా స్కూలులో

ప్రధానాంధ్రోపాధ్యాయులగు

బ్రహ్మశ్రీ శ్రీపతి భాస్కరశాస్త్రిగారిచే

రచియింపబడి ప్రకటింపబడియె.

మొదటి కూర్పు 2000 ప్రతులు.

రాజమహేంద్రవరము

క్రైస్తవ ఇండస్ట్రియల్ మిషన్ ముద్రాక్షరశాలయందు ముద్రితము

1914.

 వెల రు 0 4—0.

శ్రీ జయమస్తు.

శ్రీమదస్మద్గురు పరబ్రహ్మణేనమః.

# పీఠిక.

శ్లో. సృష్టిస్థిత్యుపసంహార విధానానుగ్రహాత్మకం
కృత్యంపంచవిధం యస్మాత్తన్నమశ్శాశ్వతంశివం

సుధీజనులారా, శ్రీమద్భరతఖండంబున చెన్నపురీమండలంబు నందు విలసిల్లుచున్న గుంటూరుజిల్లా వంగోలుతాలూకా కొప్పోలు గ్రామవాస్తవ్యులును కమ్మకుల శిఖామణులును విబుధ వరేణ్యులు నగు ప్రకాశించుచున్న సింగమునేని శ్రీ రామనూజిగారు శ్రీమద ధ్యాత్మనిష్ఠా గరిష్ఠులై యుండియు? స్వయంతీర్ణః పరాన్ తారయతి? అనున్యాయంబున సమస్తజనుల మనంబులంగల జాతికార్పణ్యాద్య జ్ఞాన తమోవ్యాపారంబు లడంగించుటకై మహేంద్రోపన్యాసాది గ్రంథంబులు శ్రుతిస్మృతి పురాణాగమేతిహాసాదికములచే విలసిల్లు నట్లు జగద్వ్యాప్తినొందించియు సర్వజన సామరస్యంబగు కర్మ, ధర్మ మర్మజ్ఞానంబుల నాచరించుటకై శ్రీరామయజ్ఞంబును వైశ్వదేవంబు ను శ్రీరామసామ్రాజ్య పట్టాభిషేక మహోత్సవంబును సర్వపం డిత జనాహ్లాదకరంబగు సభలగావించియు లోకోపకారార్థమై పా టుపడుచున్నారన్న సంగతి సర్వజనవిదితమే గావున నేనిందునూతన ముగ వివరింపవలసినది యేమున్నది. ఐనను సత్కర్మ, జ్ఞానాభివృ ద్ధికై యత్నించువారు సుక్షిజనులందరు నింకను వీరు జేయబూనుకొనిన యజ్ఞాదులకు కావలయునట్టి సహాయములు చేయుచుందురని నాచే ప్రార్థితులు ఈమహామహునికి నంకితమిచ్చి ఈ చారిత్రమును ప్రకా శింపజేసితిని కాబట్టి యే తద్గ్రంథములు వలయువారలు శ్రీమద్రాగ,

హేంద్రపురవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ మ॥ రా॥ రా॥ శ్రీ శ్రీపతి భాస్కర శాస్త్రిగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

సీ. కల్లూరివర్యుండౌ కామావధానులు సుగుణదివాకర్ల సోమయాజి
యలచిల్కపాటి రంగాచార్యవర్యులు బ్రధితుఁడౌ శ్రీపతిభాస్కర
కవి। మొదలైనసభ్యులు ముదముతో వైశ్వదేవంబు శ్రీరామ
నామార్జ్యరమ్య। పట్టాభిషేకంబు బ్రోధిసింగము నేని రామయ్య
జిగారిచే దహిజెలంగ। నల్లుజేయుంచి కొవ్వూరులనందుయాజి। చేత
నుతులొందిన యానంద జ్యేష్ఠబహుళ పంచమీయుక్తమగు భృ
గువాసరముకు స్వస్థలము రాజమహేంద్రంబు వచ్చిరెలమి.

ఇట్లు సుజన విధేయుఁడు,

శ్రీపతి భాస్కరశాస్త్రి

రాజమహేంద్రవరము

ఇది గవర్నమెంటు చట్టప్రకారం రిజస్టరీచేయబడినది.

☞ యిందు పద్యముల సంఖ్య పొరపడినది గనుక సరిచూచిన మొదల వంశావళితో 146 పద్యములు తేలుచున్నవి. గనుక చదువరులు గ్రహింప ప్రార్థితులు.

తే. గీ. ప్రతిభ కోదండరామయ్య యతనిభార్య
సతిపతివ్రత రామానుజమ్మవెలయు
వీరలిర్వురు తపములుకోరిజేసి
సుతులనల్వుర గాంచిరి ప్రతనియుక్తి 6.

ఆనల్వురినామంబులు వివరించెద.

సీ నంబెరుమాళ్ళును జ్ఞానైకనిష్ఠచే
నంబెరుమాళ్ళనే నమ్మికొల్చు
రామయ్యసద్గుణ స్తోమైకధుర్యుఁడై
రామయ్యయననొప్పు రమ్యనియతి
పెద్దకృష్ణయ్య తా బెద్దకృష్ణయ్యకు
బలసమృద్ధినటంచు ప్రోద్ధిగాంచు
చిన్నకృష్ణయ్య తా చిన్నికృష్ణమ్మయై
ధర్మసంస్థాపనత్వమునమించు
వరచతుర్విధ పురుషార్థసరణిగాంచు
నవని నాల్గుసముద్రంబులన వెలంగు
నలచతుర్వ్యూహముల భాతి నలరుచుండు
సోదర చతుష్టయముమైత్రితో దనర్చు 8.

తే. గీ. అందురామయ్య కొప్పోలునందు రామ
సిద్ధ సామ్రాజ్య పట్టాభిషేకవైశ్వ
దేవసంకల్ప మొనరించితృప్తిగాంచి
జగతి సింగము నేనివంశ మునవెలయు 9.

శా. ఈవాగ్ధాటి గభీరయుక్తి బలసాహిత్యాంచితా యూథవిద్యావైశ
ద్యయశః ప్రభావములు శేషాహీంద్ర భాషాధిపుల్
పావిణ్యంబున నెన్న శేరనగ జెప్పన్ శక్యమే యేరికిన్
హైవారంబనితోచు మూర్ఖులకు శింగమ్మ్మని రామ్యార్యసిన్ 10.

సీ. ధైర్యంబునో మేరుధరముతుల్యంబగు
ధామదేవుని చేతవంగకున్న

సద్భక్తియుక్తికి సనకాదులెనగాంచుతు
విష్ణుభక్తుల దిట్టవేయకున్న
గాంభీర్యముకు పాలకడలిదీటైయుండు
నలసురాసురులచే నలగకున్న
వితరణమునకు దా బలిదానగదధీచి
యర్థుల బరిహాసమాడకున్న
ననుచుసభలందు పండితులభినుతింత్రు
సాధుజన్నిధనుల గోత్రజలధిచంద్రు
భవ్యసింగమునేని సద్వంశవర్యు
శేముషీభూజగుణ రాజరామయార్య 11.

క. సింగమునేని కులాంబుధికిం గువలయమిత్రు
డగుచు గీర్తిగనియె శిష్టాంగీకార
తపవనములంగృతికృత్యత
రహించెరామయార్యాజుల్ 12

శా. రామయ్యార్య పరోపకార సుకృతప్రఖ్యాత చారిత్రుడై
భూమిన్వర్ధిలు పుత్రపౌత్ర నియతిన్ బుణ్యాత్ముడై
నానసంగా మహేంద్రులు పండితోత్తములు వేడ్కన్ మెచ్చగా
సద్గుణస్తోమ ప్రస్ఫుటకీర్తిచంద్రుడయి సాధుస్తుత్యతన్ రంజిలున్

ఉ. చిన్నపుడాటలందు రిపుసింహాలగెల్చుచు సభ్యకోటిచే
మన్ననలొందుచుండుటయు మ జులతన్వోలసిల్లుచుండుటల్
చెన్నుగవీరికిన్ సహజ సిద్ధమునాట జగత్ప్రసిద్ధిగా
చెన్నువహించుచున్న యదిసింగమునేని గృహాంకమిద్ధర 14

సీ. కాపాపాలులోపల కొట్టాయినిర్మించి
వైశ్వదేవమొనర్చి వైభవమున
నాజ్యధారాస్ఫూర్తి నగ్నిహోత్రుని నామ
తర్పణాదులనెల్ల దైవములను

సంతర్పణాదుల సర్వజనంబుల
సత్కారముల చేతసకలబుధుల
నిష్టకామ్యములిచ్చి యెల్లభాగవతుల
దానధర్మముల సత్కవులబుధుల
తగినదక్షిణలిచ్చి యధ్వర్యవరుల
జగతిదన్పుచు నవబృధస్నాతుడగుచు
నియతిజెలువొందు సింగమునేనిరామ
యాజసద్గుణరాజి విఖ్యాతిగాంచు 15

చ. తొలినృపకోటి జన్నములు తుల్యములెట్లగు కోటిమైన
నిచ్చలుభుజియించు వారలికిచాలునటంచనువారె మాకు
గావలయు నోసంగుడంచడుగువారలు మందునస్నౌనగాన
మీస్థలమునరామయాజి దగుజన్నము వైభవమెన్న శక్యమే 16.

---

శ్రీశుభమస్తు.

# శ్రీ రామయాజిచరిత్రము.

సీ. శ్రీరమారమణీయ సేవ్యభవ్యపవిత్ర జన్నిదములగోత్రజలధచంద్ర
సాధుసజ్జనపోష సద్గుణమణిభూష సత్యగాంభీర్య వాచాఫణీంద్ర
వేదశాస్త్రవినోద విద్వద్గణామోద వర్ణితాహ్లాదవైభవమహేంద్ర
మేరుభూధరధైర్యసారవిశ్రుతశౌర్యగౌరవస్తవనీయ్యకార్యసాంద్ర
వితతభవదీయచారిత్ర విస్తరించి
సీసఫణితి రచించెదచిత్తగింపు
భళిర విశ్రుతశేముషీభాజనుగుణ
రాజసింగమునేని శ్రీరామయాజి.

సీ. వాల్మీకిమొదలగు పరమునీంద్రులకెల్ల నేనామజపముతో తృప్తిగల్గె
కాళిదాసాది సత్కవిబృందమునకెల్ల నే వంశవర్ణన నింపుగల్గ

నీవుదైవాంశభవుడవౌ నిక్కముగను
భళిర విశ్రుతశేముషీభ్రాజినుగుణ
రాజిసింగము నేని శ్రీరామయాజి 4.

సీ. అతడు వన్యాహారి యితడుధన్యాచారు
డతనికంటె నితండెయధికుడగును
అతడు వాలినిగూల్చె నితడుగీలినివేల్చె
నతనికంటె నితండెయధికుడగును
అతడు కోతికిమిత్రు డితడునీతికిమిత్రు
డతనికంటె నితండెయధికుడగును
అతడునైరులగొట్టె నితడుకూరులనెట్టె
నతనికంటె నితండె యధికుడగును

రాముడాతండు జగదభిరాము డితడు
ననుచు నిన్నొగడుచుందురఖిల బుధులు
భళిరవిశ్రుతశేముషీ భ్రాజినుగుణ
రాజిసింగము నేని శ్రీరామయాజి 5.

సీ. అప్పతాతయటంచు నాడనేర్చిననాడె
సత్యమేబల్కెడి శాంతనిధివి
తప్పటడ్గులుపెట్టు నప్పటినుండియు
ధర్మంబుదప్పని ధైర్యనిధివి
అక్షరగుణితంబు లందులాకేత్వంబు
దాకుత్వమియ్యని దానఖనివి
చదువుట వ్రాయుట లౌదవునప్పటినుండి
బ్రహ్మవిద్యనెరుంగు ప్రౌఢమతివి

నీసుగుణములునేర్చి వర్ణింపవశమె
సలువకైనను వేనోళ్ళచిలువకైన
భళిర విశ్రుతశేముషీ భ్రాజినుగుణ
రాజిసింగము నేని శ్రీరామయాజి 6.

సీ. ఇచ్చెనాయర్థికి నికచాలుననుదాక
నేనిగపాడిగానిచ్చునేర్పు
మెచ్చెనాతృణమైన మేరువుగాజేసి
మృదువాక్యపద్ధతి మెచ్చునేర్పు
హెచ్చెనాసభలలో నెట్టియుక్తులునైన
నింతలింతలుజేసి హెచ్చునేర్పు
తెచ్చెనాసురవర్త్మ దివ్యామృతంబైన
తివిరియత్నంబున దెచ్చునేర్పు

నీకెచెల్లునటంచును నిఖిలసభల
నభినుతింతురు బిరుదుపద్యములగవులు
భళిర విశ్రుతశేముషీ భ్రాజిసుగుణ
రాజిసింగమునేని శ్రీరామయాజి 7.

సీ. వేదశాస్త్రరహస్య విద్యలెల్లగ్రహించి
మతిననుష్ఠానపద్ధతిరహించి
శ్రుత్యుక్త లీశ్వరకృత్యంబుగ దలంచి
యందుకు ప్రభుసేనుడని నుతించి
సద్విద్యనిచ్చు నాచార్యుడేయనియెంచి
యాచార్యుపాదంబు లాశ్రయించి
గురుడిచ్చు బ్రహ్మంబు గురుతునెమ్మదినుంచి
తన్నుతానెరుగుటాత్మనుగణించి

ప్రకృతిజనులకు సంసారివలెనటించు
నీరహస్యంబు వినుతింపనేరవశము
భళిర విశ్రుతశేముషీ భ్రాజిసుగుణ
రాజిసింగమునేని శ్రీరామయాజి 8.

సీ. మదివిశిష్టాద్వైత మార్గమెల్ల నెఱింగి
పంచసంస్కారసంధర్కమేధి
శైవమతప్రస్థానశాస్త్ర సర్గమెల్ల నెఱింగి

తాదృశచిహ్న విస్తరము నేది
శాక్తమతాచార సర్గమెల్ల నెరింగి
వామదక్షిణావృత్త ఘణుతు లేది
చతుర గాణాపత్య మతసారము గ్రహించి
డాంబిక వ్యావర్తకంబు నేది
షణ్మతాపూష పరతత్త్వసారమూని
విశ్రుతాద్వైతమతమె భావింతువార
భళిర విశ్రుత శేముషీ భ్రాజినుగుణ
రాజసింగము నేని శ్రీరామయాజి 9.

సీ. పంచాక్షరీమంత్ర పంచాయుధములూని
పంచముద్రలు పట్టి పంచెగట్టి
పంచతన్మాత్రలన్ పాంచజన్యముబట్టి
పాంచభౌతికచక్ర మెంచితట్టి
పంచపంచస్వన పటుకిరీటము దాల్చి
పంచవాయులతార్క్ష్య వాహనముగ
పంచచిదావస్థ లెంచి సజ్జగ జేసి
పంచకర్తలగద్దె పైవసించి
పంచవింశతితత్త్వ ప్రపంచ రాజ్య
మేలువిష్ణుడవీ వందు రెల్ల బుధులు
భళిర విశ్రుత శేముషీ భ్రాజిసుగుణ
రాజసింగము నేసి శ్రీరామయాజి 10.

సీ. నీసత్యవాగ్ధాటి నీగభీరతయును
నీశౌర్యగరిమంబు నీశమంబు
నీదువౌదార్యంబు నీపటుత్వంబును
నీవైదికాచార నిపుణతయును
నీ జితేంద్రియనిష్ఠ నీపరాకాష్ఠయు
నీపదోపక్రియయు నీ[illegible]

నీగౌరవోక్తులు నీదుమర్యాదయు
నీవైదికప్రజ్ఞ నీఘనంబు
నీప్రభావంబు నీదుపాండిత్యమహిమ
నీచమత్కారమవని వర్ణింపవశమె
భళిర విశ్రుతశేముషీ భ్రాజిసుగుణ
రాజిసింగమునేని శ్రీరామయాజి 11.

సీ. బ్రహ్మాహమస్మియన్ బరమరహస్యంబు
గుర్తెరింగిన గురుమూర్తివీవు
తత్వమసిత్వంత దసియన్నయర్థంబు
గుర్తెరింగిన సత్వమూర్తివీవు
అహమేవబ్రహ్మ యందర్థ తాత్పర్యము
ల్గుర్తెరింగిన పుణ్యమూర్తివీవు
అద్వయబ్రహ్మంబు సార్థకంబునెరింగి
కీర్తిగాంచిన దివ్యమూర్తివీవు
మనుజరూపంబుతోనిట్టి మహిమగాంచి
లీలజెలువొందుచున్న నిర్లిప్తుడవుర
భళిర విశ్రుతశేముషి భ్రాజిసుగుణ
రాజిసింగమునేని శ్రీరామయాజి 12.

సీ. వరునకు మూడు రుణంబులుండున
టన్నశ్రుతివచనములకు ప్రతిఫలముగ
దేవతార్షిఋణంబు ద్విజసమారాధన
తృప్తిగావించిన ధీరనిధివి
వైశ్వదేవతనూజ వర్ధిష్ణుతలపిత్రా
ణవిముక్తి జేసిన నయువిదుడవు
పంచయజ్ఞపరత్వ సంచితయుక్తిచే
ఋషిఋణముక్తి గావించుఘనుడ
వాశ్రితుల కల్పవృక్షమై యమరునిన్ను

ప్రస్తుతింపగ వశమానె బ్రహ్మకైన
భళిరవిప్రశుత శేముషీ భాగ్యజనుగుణ
రాజిసింగము నేని శ్రీరామయాజి 13

సీ. స్వప్నంబునందైన చాటూక్తులందైన
యనృతంబు నెరుగని యార్యుడితడు
భావంబునందైన పరవనితాసక్తి
నెరుగని సద్బుధవరుడితండు
పరవిత్తహారులతో భాషింపనొల్లని
మహనీయ బుధశిఖామణియితండు
ప్రకటపరోపకార ప్రౌఢిజెన్నొందు
కీర్తిగాంచిన కృతకృత్యుడితడు
భవ్యుడితడని సకలసభాస్థలముల
గణుతిసేతురు వందిమాగధులునిన్ను ॥భళిర॥ 14.

సీ. కలిదోషజలధి పంకంబులింకింపంగ
నవతరించిన బడబాగ్ని యొకొ-
దుర్వాదలతికల దుంపదెంపగజాలు
నిసితమైనట్టి ఖనిత్ర మొకొ-
కార్పణ్యదౌర్భాగ్య కాననంబులుకాల్ప
వాటమైతగు దావ వహ్నియొకొ-
దుష్టభూధరముల త్రుళ్ళడంపగజాలు
ధీయుక్తి మెరయునజాయుధంబొ
యనుచుసభలందు బుధవరులభినుతింప
నలరుచుందువు వాగ్ధాటి నతిశయిల్లి ॥భళిర॥ 15.

సీ. ఎందరెందరుధన వృద్ధులుండిరిగాని
నీవలెనైదిర విఖ్యగనిరె
ఎందరెందరుగుణ వృద్ధులుండిరిగాని
నీవలె ఖ్యాతి గాంచిరిగదె

యెందరెందరుబల వృద్ధులుండిరిగాని
నీవలె సద్ధర్మనేతలైరె
యెంది రెందరు కులవృద్ధులుండిరిగాని
నీవలె సన్మార్గనిపుణులైరె
యవని నారాయణాంశ సంభవుడనగుట
కివినిదర్శనమందు రియ్యెలనుబుధులు ॥భళిర॥ 16.

సీ. సమత పరోపకారమునకేగిద నీవు
దేశదేశంబులు దిరుగుటెల్ల
ధనమదాంధులగర్వ మణచుటకేగద
యెంచి బంధుల ధిక్కరించుటెల్ల
కూరిగాత్ములకు నీతికోరి దెల్పనెకిదా
మానకవైరంబు బూనుటెల్ల
ధర్మమార్గంబు సంస్థాపించుటకెగదా
చెలగివిత్తంబు నార్జించుటెల్ల
నెరుకగల్గిన సుజ్ఞాని కెరుకగాక
నీచులకునెట్లు దెలియును నీదుగుట్టు ॥భళిర॥ 17.

సీ. జవసత్వములచేత సప్తసముద్రముల్
సూటిగా చెంగున దాటవచ్చు
నతిభయంకరమగు హాలాహాలంబైన
గుటుకు గుటుక్కన గ్రోలవచ్చు
కులపర్వతింబుల గోళీకాయలు జేసి
నీశైనగోటితో మీటవచ్చు
ధరణీనభంబులు తాళంబులుగ జేసి
యంచితంబుగను వాయించవచ్చు
గాని నీగుట్టు దెలియ నెవ్వానితరము
నీతపోబల మానిదినిక్కముగను, ॥భళిర॥ 18.

సీ. శబ్దాదివిషయముల్ సమిధలుగా జేసి
చిద్వహ్నియందు వేల్చినఘనుడవు
మతిసోమిదమ్మ సమ్మతిసోమయాజిగా
యజ్ఞంబొనర్చిన ప్రాజ్ఞనిధివి
జాగ్రదాదికమును సాక్షిత్వమునుబూని
గృహమేధివై యున్న కీర్తినిధివి
యతిపరివ్రాజకాద్య మగతరు క్రియ
శోభిల్లుచున్నట్టి సుగుణఖనివి
యిట్టినీవొనరించిన కృత్యమెల్ల
కోరిలోకోపకారంబు కొరకుగాదె ॥భళిర॥ 19.

సీ. నిన్ను దూషించిన నీచమానవులెల్ల
పనికిరాని ద్విపాదపశువులనుచు
నిన్న సహ్యాంచిన నీరసాత్ములకెల్ల
తృభక్షణంబ ప్రాప్తించెననుచు
నిన్ను దుర్భాషని తిట్టుచున్న మూఢాత్ములు
నిందలొందుచునున్న పందలనుచు
నిన్ను మార్కొన్న పాండిత్యహీనులు నెల్ల
కూరిర నిరక్షరకుక్షులనుచు
వేరెచెప్పంగవలెనె పృథ్వీస్థలమున
కంకణముదెల్ప నద్దంబుగావలయునె ॥భళిర॥ 20.

సీ. కోదండ రామయ్య కూర్మిపుత్రకుడవై
యక్కలక్ష్మికి భర్తవై చెలంగి
రంగనాయకు లలరంగ కుమారుడై
యాత్మభక్తిదనర్చియలరునీకు
భుజకీర్తులై యుండి బుద్ధిమంతులునాజ్ఞ
బద్ధులైసోదరుల్ భక్తిగొలువ

శ్రీరామపట్టాభిషేకంబు వైశ్వదే
వంబొనరించిన భాగ్యనిధివి
తల్లిరామానుజమ్మ తద్దయున్ బ్రోవ
ప్రబలి ప్రబలుచునున్నావు ప్రబలగలవు ॥భళిర॥ 21.

సీ. ఋతుకాలములయందె రతిసల్పు వ్రతమూని
దీక్షసల్పిన జితేంద్రియుడవీవ
ఇరుప్రొద్దు గుడుచుచు నెడనెడగుడువక
యున్న శాస్త్రోక్త సదోపవాసి
వారలకు హానిలేకుండగబల్కెడి
సత్యవాక్యప్రతిష్ఠాపకుడవు
సాధు సజ్జనబంధుజనుల రక్షించుటః
కూహజెల్వొందు పరోపకృతివి
నిన్ను దెలియక యెవ్వరేమన్న నేమి
రవిపైని బూదిజల్లినట్లవునుగాదె ॥భళిర॥ 22.

సీ. నీళ్లుమోచెడువాడు రాళ్లుమల్చెడువాడు
నీ మహాత్వంబెట్లు లెరుగనేర్చు
కన్నెనమ్మినవాడు దున్ననమ్మినవాడు
నీధర్మగుణమెట్లు లెరుగనేర్చు
నూటినేరనివాడు కూటిపేదగువాడు
నీరహస్యంబెట్లు లెరుగనేర్చు
సూత్రమెరుగనివాడు గోత్రమెరుగనివాడు
నీయోగ్యగుణమెట్లు లెరుగనేర్చు
తాల్మిలోకాపకార తత్పరుడవగుచు
పాటుబడుచుంటివౌర నీపట్టుదలను ॥భళిర॥ 22.

సీ. వర్ణాశ్రమాచార వర్ధిష్ణుతకుగాని
సంసారసుఖవిలాసముకుగాదు

ప్రజలకానందంబు బ్రాపించుటకుగాని
స్వాత్మలాభైక తత్పరతగాదు
పుడమిసత్కార్యముల్నడిపించుటకుగాని
తనమేలుకోరిన పనికిగాదు
కులస్థానప్రతిష్ఠలు నిల్పుటకుగాని
యాత్మలాభస్ఫూర్తి నలరికాగాదు
నీమనోదార్ఢ్యమెరుగని నీచనరులు
నెంతదూషించుచున్న నీకేమికొదువ ॥భళిర॥ 24.

సీ. బృందారకాధీశ మందారబిసకుంద
కుందాదినిధుల కెక్కుడుగనెగడి
హారహీరపటీర తారకాధిపబల
నీరదశారద నియతిదెగడి
కాశడిండీర వికాసవన్మల్లికా
నీహారకలశ వార్ధిధులదెగడి
నందికేశ్వరసుధా నందసుందరమంద
హాసహంసంబుల వాసినినగి
నీలసత్కీర్తి చంద్రికల్నెగడుచుండు
సాధుసజ్జనవినుత రాజద్గభీర ॥భళిర॥ 25.

సీ. ఐహికసుఖములందాసక్తి గలవాడు
స్నానసంధ్యాదులమానుకొనడె
ఆలుబిడ్డల సౌఖ్యమాత్మగోరెడువాడు
వైదికనిష్ఠలు వదలుకొనడె
కోటలు మాడువుల్కోరినమనుజుండు
స్వప్నమందైన యజ్ఞంబులనునె
నధికారవృత్తికై యరయుచుండునరుండు
నాంగ్లేయవిద్యయే యనకయున్నె
కణగినీవలె పరమార్థకాంక్షియగుచు

పరులకుపకృతు లొనరింతుఁ బాటుబడుచు ॥భళిర॥ 26

సీ. ఒకచోన గౌరవ మొందుచుఁ విసువక
యొకచోట గౌరవాధికత మెలగు
నొకచోటశాకంబు లోగిరింబుగ మెక్కు
నొకచోట శాల్యోదయ మొత్పుకుడుకు
నొకచోటబొంత నే రొప్పుగాధరియించు
నొకచోదు కూలవస్త్రికలనూను
నొకచోటరాలపై నోపికతో బండు
నొకచోట హంసతూలికశయించు
నట్టివాఁడె మనస్వి కార్యార్థి యనుచు
పట్టుదల నెరవేర్చిన దిట్టవీవు ॥భళిర॥ 27.

సీ. ఇటు జేసి తేజ తేరెక్కు జోదుదయించు
కొండపై మృగరాజు దండు గెల్చి
ఇటుపాపరేడు భుజించువిందుజనించు
కొండపైతరువుల గుంపునొంచి
ఇటునీటి మెకిమీని యెలమియాటలగిము
కొండపై పువ్వుల చెండుజిమ్మి
ఇటుశాంకరికిపుట్టి నింటిచల్లదనంపు
కొండచమరివాలషండ మొంచి
యందు నిందును నీకీర్తి యల్లుకొనియె
నిష్టకామ్యాజయోల్లాసి వింతనిజము ॥భళిర॥ 28.

సీ. ఎన్నెన్ని విఘ్నంబు లేతెంచిననదన్ని
గోటమీటివయట్టి గుణసముద్ర
ఎంద రెందర్లు విరోధించినప్పటికైన
నిర్లక్ష్యమైపోయిన నీతినిపుణ
ఎందఱుళ [illegible] వక్రించి [illegible]
పట్టుదల [illegible] భాగ్య [illegible]

ఎందరికార్యంబు లిపుడువద్దన్నను
తప్పకుండయొనర్చు ధన్యచరిత
పట్టుదలగల్గినట్టి సాఫల్యసిద్ధి
నీకె చెల్లును సద్ధర్మనీతివిభవ ॥భళిర॥ 29.

సీ. ధరణినుద్యోగినః పురుషసింహముపైతి
లక్ష్మీయన్వాక్యంబు లక్ష్యముంచి
యత్నే కృతే నసిధ్యతి కోత్రదోషోయ
దియటన్న వాక్యంబు ధిక్కరించి
దేశాటనంబు సుధీజనసేవనం
బతిసుకృతంబుగదా యటంచు
తనజాతివారి విద్యాభివృద్ధికిపాఠ
శాలలు స్థాపించు శ్రావ్యమొరసి
యలం జేతువుబహుళ పురుషార్థసిద్ధి
సాధువర్గ్యాంకిదిగదా సహజగుణము ॥భళిర॥ 30.

సీ. కులశైలమందర కుధరామరాద్రులు
నీధైర్యమును వర్ణింపుచుండ
సరసంబుగా సప్తసాగరంబులుగూడ
నీగభీరతను వర్ణించుచుండు
కల్పవృక్షంబును కామధేన్వాదులు
నీదానమహిమ వర్ణించుచుండు
వాణీశగీష్పతి ఫణిసార్వభౌములు
నీవచోధాటి వర్ణించుచుండ్రు
సకల సద్గుణవనధి విశ్రాంతనిధివి
సన్నుతింపగ నేరికి శక్యమగును ॥భళిర॥ 31.

సీ. కులమువారలకు విద్యలునేర్పుటకుగదా
పాఠశాలలకియు పాటుపడుట

దోషాత్ములనుచును దూషించుటనగదా
యజ్ఞోపవీతంబు నరుతనిడుట
పంతంబు నెరవేర్ప ప్రతినబూనియెకదా
శ్రీరామయజ్ఞంబు జేసికొనుట
లోకోపకారార్థమేకదా సత్కృత
బహుపురుషార్థమై భవముగనుట
కూరిరజనములకెప్పుడు గుండెదిగులు
నీవుచేసెడి సత్కార్య నిపుణహావము ॥భళిర॥ 32.

సీ. నాల్గుమోములు లేని నలినసంభవుడని
రెండుజిహ్మలులేని కుండలీంద్రు
డవుడిచ్చి మరలతీయనిచంద్రుడితడని
పరిపాటిదప్పని వ్యాసుడితడు
పాక్షికత్వము లేని వారిజాక్షుడితండు
సన్యాసమూనని శంకరుండు
పవనాత్మజుడుగాని వడముడి యీతండు
విండ్లమ్ములూనని విజయుడితడు
ననుచుసభలందు బొగడుదు రనుదినంబు
వంశదీపకనిను గుణమైభవమున ॥భళిర॥ 33.

సీ. నీకీర్తిబోలబూనిస పంకజము వేయి
దళములై నీటిపైచులక నయ్యె
నీకీర్తినెనయబూనిన వేల్పుగిడ్డి చెం
గలిగడ్డి దానోటగరచుచుండె
నీకీర్తినుద్దిబూనినయట్టి చౌదంతి
నెల్లనై బయలులో వెలయుచుండె
నీకీర్తితో ప్రబలినెనసిన ఫణిరాజు
కుబుసంబు వదలించుకొనుచునుండె

సీతపస్సిద్ధినెందు వర్ణింపవశమె
ఘనతమీరిన సనకాదిమునులకైన ॥భళిర॥ 34.

సీ. షణ్ముఖీఖేచరీ శాంభవీమొదలైన
పంచముద్రల సొంపువరుసనెంచి
యందు ప్రాణాయామ మానందముగ్రహించి
యజపగాయత్రితో నంచలెంచి
పంచవింశతితత్వ సంచితంబునుదాటి
తారకబ్రహ్మతత్వమ్మెరింగి
సాంఖ్యామనస్క సంస్కారసంశుద్ధితో
బ్రహ్మహమస్మియ న్భావమూని
రాజయోగంబు మర్మంబు రహినెరింగి
నట్టిసర్వజ్ఞ దివ్యమహాత్ముడవుర ॥భళిర॥ 35.

సీ. ముందుముందుగ డెందమెందు జెందగనీక
పొందుగ నిల్పియస్పందవృత్తి
నొందియందుకళావినందిత సారస
బృందంబులెనసి ఘనందుమీర
కుండలిపైల సన్మండపంబునమేడ
నుండి యానందించుచుండువాని
దండసుఖంబుండు పుండరీకాక్షుని
నిండుకొల్వునవేడ్క నిండియున్న
భూరియోగీంద్ర చంద్రుడవారసజ్ఞ
వర్ణనీయతగనుచక్రవర్తివీవు ॥భళిర॥ 36.

సీ. రంగదుత్తుంగ షడ్లింగసంగతసర్వ
మంగళాధీశ సర్వాంగపూజ
సాంగంబుగాజేసి భృంగీశ్వరోత్సాహ
సంగీతనాద ప్రసంగయుక్తి
నింగిపైప్రాకి లవంగలుంగలతాకు

దుంగమంగళసౌధ రంగమందు
బంగరుబొమ్మయో నంగనామణితోన
నంగరంగత్ప్రసంగైక సతత
మింగితజ్ఞాన శృంగారసంగివగుచు
రంగుగ జెలంగుచుందువు ప్రాభవమున ॥భళిర॥

సీ. సాధనవర్గంబు సాధించి సాధూక్తి
బోధావిలాసచిన్మోద జెంది
క్రోధాదికము గెల్చి గాధలువర్జించి
వ్యాధులదోలి శ్రీనాథుడైన
రాధానుధామధు రాధరాధరునిన
మాధిలోగని సౌఖ్యబోధబొంది
మాధవశబ్దార్థ మహనీయ ధనధాన్య
గౌరవారాధిత కార్యుడగుచు
రాజ్యమేలుచునున్న విభ్రాజమాన
మాన్యచారిత్రనీతో సమానులెవరు ॥భళిర॥ 38.

సీ. ఇంటిముంగిటికల్ప వృక్షరాజంబగు
దొడ్డిపెట్టిన వేల్పుగిడ్డియగును
నాకటికొదవిన యలపాయసాన్నంబు
తంగేటిచెట్టున దగినజున్ను
అర్థికిముంగొంగు నందున్న పుత్తడి
చేరువనున్న బంగారుకొండ
కోరికదీర్చెడి సారచింతామణి
సన్నుతిగల్గిన పెన్నిధాన
కులమివాత్సల్య కరుణాది లలితమధుర
వినయభరణంబు భవదీయవితరణంబు ॥భళిర॥ 39.

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠాన కృత్యంబులు
నర్హాకాలమునందె యాచరించి

వితత విస్తృతమయి విమలమై విలసిల్లు
స్వచ్ఛవివిక్త దేశంబునందు
భూశుద్ధియొనరించి భూతశుద్ధియొనర్చి
వరుసప్రాణాయామ పరత నెరపి
పూరక రేచకంబులు కుంభకంబును
మంత్ర మంత్రార్థమర్మము లెరింగి
షడ్విధసమాధులాత్మ నిశ్చలతబూని
సుకృతివగు బ్రహ్మవిద్వ రిష్ఠుడవునీవు ॥భళిర॥ 40.

సీ. తారక సాంఖ్యముల్తగునమనస్కంబు
ధర్మమర్మమెరుంగు ధార్మికుడవు
మునుమున్న వైరాగ్య బోధోపరతులను
పాలసంద్రమునీదు భవ్యనిధివి
సాత్వికత్వమున ప్రస్థానత్రయంబును
గురుకృపగాంచిన కోవిదుడవు
సోహంమ మేతి బ్రహ్మోపాసనంబున
సర్వంబెరింగిన శాంతనిధివి
ఐహికాముష్మిక సుఖోన్నతైకరసిక
విలసదభినవ విద్యావివేకనిధివి ॥భళిర॥ 41.

సీ. మేరుశైలముక్రిందు మీదుగానిల్చిన
నేడువారాసులు నింకియున్న
సూర్యచంద్రులు గతుల్ సూటిగాదప్పిన
సలిలంబునగ్నితో సాటిగన్న
ఆకసంబును ఖండమై విలసిల్లిన
వహ్నియు సీతలత్వంబుగనిన
భూమిరజోరూపమునను వర్తిల్లిన
భువనంబులెల్లను బూదియైన
స్వప్నమున నవ్వులాటకై పలికినట్టి

పలుకు వేదాక్షరంబని పలుకవచ్చు ॥భళిర॥ 42.

సీ. అడుగులుకోల్పెడి యబ్బపీంద్రునికంటె
దీనత్వమొందు రాధేయుకంటె
నిచ్చివెల్వలబోవు నెలమి మేఘముకంటె
తృణముమేసెడు కామధేనుకంటె
వడిమోగుచున్నట్టి పాలసంద్రముకంటె
కాసెడికల్పవృక్షంబుకంటె
ధటమునవిడు శిబిధరణీధవునికంటె
నున్న నౌతలపురా మిన్నకంటె
నతివినయ ధర్మకుశలత సమగియున్న
నీదువితరణ మహిమంబు నెగడుచుండు ॥భళిర॥ 43.

సీ. రజకపుత్రకుడు నారదుడు తపంబుచే
బ్రాహ్మణుడైన ధర్మంబువినరో
జాలారిసుతుడు వ్యాసమహర్షి తపముచే
బ్రాహ్మణుడైన ధర్మంబువినరో
సానికొడుకగువసిష్ఠ మహర్షితపముచే
బ్రాహ్మణుడైన ధర్మంబువినరో
ఖరతనూభవుడగు గర్గుండుతపముచే
బ్రాహ్మణుడైన ధర్మంబువినరో
తపముచేగాదె బ్రాహ్మణత్వంబు గనుట
ననుచుబ్రహ్మత్వమొందితి నవనియందు ॥భళిర॥ 44.

సీ. బ్రహ్మత్వమునకు వర్ణముకారణముగాదు
సత్యధర్మపవిత్రాచరణగాని
విప్రత్వమునకు దేహప్రవీణతగాదు
స్వాత్మైకనిష్ఠచే నలరుగాని
భూసురత్వమునకు పైనమర్థతగాదు
శమదమాదులచేత నమరుగాని

పుడమి వేల్పుగుటకు వెడ వెడయుక్తులా
పండితార్థ మెరుంగవలెనుగాని
వేష భాషలచేత నావిప్ర్పుడగున
టంచుమను సూత్రిముధరించు ననఘుడౌర ॥భళిర॥

సీ. వీరికీయజ్ఞోపవీత మేలనుచుకా
ర్పణ్యంబుబూను నిర్భాగ్యజనుల
వీరికీ వేదముల్వినగూడదనుచువా
దించెడిమూర్ఖపుదృప్తజనుల
వీరికీసత్కర్మ వృత్తమనర్హమన్
కొంటెనిరక్షర కుక్షిజనుల
వీరికీయజ్ఞార్థవిత్తముల్ స్వార్థమ
స్వాత్తసమస్వాతమత్తజనుల
లసదుపన్యాస పూర్వకోల్లసనమృదుల
విశదవాగ్ధాటిచే గెల్చివెలసితౌర ॥భళిర॥ 46.

సీ. స్త్రీ శూద్రులకు విద్య చెప్పకూడదటంచు
కోరవాదింతురు కొంతమంది
చదువునేర్చినవారు స్వాధీనులౌదురు కే
కూడదు చదువంచు కొంతమంది
చదివినచో వేద శాస్త్రంబులేటికి
గుర్తెరుంగరేయంచు కొంతమంది
శూద్రులకా వేద చోదితకర్మలు
వింతనీతులటంచు కొంతమంది
యిట్టివాదంబులొకమూల గట్టిపెట్టి
సభనుపన్యాసమిచ్చు వాక్చతురుడవుర ॥భళిర॥ 47.

సీ. నీవొనర్చిన వైశ్వదేవంబుగ న్గని
యటు నిటు గుసగుసలాడువారు
నీస్నానసంధ్యాది నిష్టలుగ న్గని

భావించివెవ్వేల బోవువారు
శ్రీరామపట్టాభిషేకంబుగన్గొని
యహహాసేబాసని యలరువారు
నన్నదాన మహోత్సవాదులుగన్గొని
మేలుభళీయంచు మెచ్చువారు
వైరివైరులుమిత్త్రులు నద్భుతముగ
నవనివెయినోళ్ల నినుగొనియాడిరహాహా ॥భళిర॥ 48.

సీ. మునుపు నిన్వెక్కిరించిన వారలేగదా
యిపుడు నీకు నమస్కరించువారు
మునుపునిన్ హాస్యమాడిన వారలేగద
యిప్పుడునిన్ సత్కరించువారు
మునుపునిన్దూచి నవ్విన వారలేగద
యిప్పుడు నిన్ను భూషించువారు
మునుపునిన్ గోపగించినవారలేగద
ఇప్పుడు నిన్ బ్రస్తుతించువారు
దైవఘటనంబొ నీదు సద్భావమహిమొ
యేమిచిత్రంబొ యీవింత యెవరికెరుక ॥భళిర॥ 49.

సీ. ఎవ్వడుజనకాజ్ఞనే శిరంబునబూని
యడవులదిరిగి పెక్కిడుమలోర్చె
నెవ్వడు మునులకు నికభీతిలేదని
యభయహస్తంబిచ్చె నద్భుతముగ
నెవ్వనిభటుడు లంకేశుగర్వమడంచె
వాలంబె పీఠంబువలె నమర్చి
యెవ్వడుకపులచే నెల్లరుమెచ్చంగ
వారిధిగట్టించె వైభవమున
నతనినామంబు నీకిడినందుకిట్టి
యద్భుతము నీతపఃఫలమంద్రు బుధులు ॥భళిర॥ 50.

సీ. తరుగనియన్నంబు తరుగని పప్పును
తరుగని పచ్ఛళ్ళు తరుగనట్టి
కూరలాజ్యంబులు కోరిన పెరుగును
తరుగనట్లుగను సంతర్పణంబు
వరుసనష్టాదశవర్ణంబునకు జేసి
తృప్తిగావించిన ధీరమతివి
బర్హిర్ముఖులు హవిర్భాగంబులంది
రందుకుతత్క్షణంబున తొలకరించె
నదిమహానంద మొనరించె నఖిలజనుల
కనఘభవదీయ దీక్ష నేమనగవచ్చు ॥భళిర॥ 51.

సీ. కర్మశబ్దభవంబు క్రమశబ్దభవంబు
కమ్మయటంచు వ్యాకరణమొప్పు
కర్మవేదోక్తమౌ కర్మకు బేరగు
క్రమంబుమ్మృదువయి గణుతిగాంచు
నటుగాన శ్రుతిచోదితాచారపద్ధతి
సశ్రద్ధచేత బ్రాహ్మణులకొనగి
యిష్టమైనవుడు మాకిమ్మనిరప్పుడు
శిష్టధర్మనిరూఢి జేయవచ్చు
వైదికాచారములు కమ్మవారటంచు
ననియుపన్యాసమియ్యవే యార్యసభల ॥భళిర॥ 52.

సీ. అవసరమున్న నయ్యాచారమిమ్మంచు
వైదికద్విజుల కీవచ్చుదొల్లి
యదియిప్పుడవసరమైన గైకొనవచ్చు
ప్రీతితోనంగీకరించవచ్చు
యజ్ఞసూత్రంబు పేరగును జంధ్యంబు జ
న్నిదమ్మంచు తెలుగున నెగడుచుండు
తన్నామధేయ గోత్రనిదర్శకమ్మగు

సద్విజులనుటకు సందియంబె
యిదియెరింగిన వారలిక్లేగణింతు
రనియుపన్యాసమిచ్చితి వార్యసభల ॥భళిర॥ 53.
పాండవులేవురు బ్రతికియుండగలక్క-
యింటగతించి రంచెంచియాంబి
కేయుండువిదురుచే చేయించెవారికి
పరలోకకృత్యంబు వైదికముగ
వాలికిసుగ్రీవుడేలీల నొనరించె
నిలవిభీషణుడన్న కేటుల జేసె
భారతరామకథా రహస్యంబుల
నెరిగిన వారలిక్లెందుకందు
రనియుపన్యాసములు చెప్పియఖిలసభల
దనరనాటితి విజయ స్తంభమహాహా ॥భళిర॥ 54.

సీ. మనకెందు కీటువంటి ఘనకార్యములుమాను
కాదుకూడదటన్న కమ్మవారు
నిదురించుసర్పంబు సదలించిలేపుట
గాదెయొట్టివిదనున్న కమ్మవారు
వదలుచున్నది తొల్లి పిదపదిదేమొ మొడ
గిట్టుకోనేలను కమ్మవారు
వైశ్వదేవము సేయ వలదనకూడదు
గద మేలుమేలనుకమ్మవారు
పలుదెరంగుల బలికెడు పలుకులెల్ల
చెవినిడక దీక్షనడిపిన సిద్ధపురుష ॥భళిర॥ 55

సీ. వలదన్నవారెల్ల బ్రతిమాలుకొనుచు
సంభావన లొసగిన భవ్యులైరి
భోజనంబులు చేసి పూర్ణాహుతినిదక్షి
ణలపూజ జేసి యత్యలఘులైరి

భూరి దక్షిణల తాంబూలంబు లర్పించి
తృప్తిగావించుచు ధీరులైరి
యవభృథస్నానంబు నందుగృతజ్ఞత
జంపతల్గూడి సుస్నాతులయిరి
శుద్ధతనులు మనోభీష్టసిద్ధులైరి
యనఘభవదీయ పుణ్యమేమనగవచ్చు ॥భళిర॥ 56.

సీ. మెద్రాసుప్రెసిడెన్సి మేదినిగుంటూరు
జిల్లాను నెంగోలుచెంతనున్న
కొప్పోలుగ్రామాన కోరిగ్రిష్మర్తువు
నందు జ్యేష్ఠంబునయందు శుక్ల
దశమినానంద వత్సరములో వైశ్వదే
వంబుగావించిన పండితుడవు
ఈవిధి నెవరైన గావించిరే్శ్గాల్లి
యనురావతీపట్టణాధ్యుబోలి
వైశ్వదేవంబొనర్చిన ఫలముగొనుచు
మూడుఋణములు తీర్చిన పుణ్యనిధివి ॥భళిర॥ 57.

సీ. ఒకచోట వేదశాస్త్రికథా వినోదంబు
లొకచోట సద్వాక్య నికరములును
నొకచోటగీతరసిక చతురతలును
నొకచోటమంజువాంశిక వినోద
మొకచోటమార్దంగిక కృతభూరిధ్వను
లొకచోట రామభక్త్యుత్సవంబు
లొకచోట పూర్వరాజోత్సాహ కృత్యంబు
లొకచోట విబుధపఙ్క్తినివిందు
లొక్క మొగి వెయ్యినేత్రంబు లున్నయట్లు
హోమదీక్ష వెలంగుచు నుంటివౌర ॥భళిర॥ 58.

సీ. బంధుకోటినదల్చి పనులుజెప్పెడినేర్పు నెలమితో జెప్పిచేయించు
నేర్పు। విబుధోత్తములతోడ విన్నవించెడినేర్పు వేదార్థజాతంబు
వినెడినేర్పు। ధర్మశాస్త్రార్థముల్ తగనెరింగెడినేర్పు తెలియునట్లు
గను బోధించునేర్పు। నీకె చెల్లునటంచు వర్ణింతుఱబుధులు। నిలను
పాధ్యాయుడ వనంగ మెలగు దవుర ॥భళిర॥ 59.

సీ. కొప్పోలులో నరికూడుగల్గిననాడు బరమాన్నభక్ష్యముల్దొరికిన
ట్లు। కొప్పోలులోనుంచి పప్పుగల్గిననాడు పంచభక్ష్యములు భు
జించినట్లు। కొప్పోలులో నొక్క కూరలభించుట షడ్రసాపూప
భోజనములట్లు। కొప్పోలులోపల కూర్చుండుటకు చోటు దొరికిన
మేడలుదొరికినట్లు। లిట్టి కొప్పోలు నందు సమృద్ధినన్న। దానమొ
నరించెననుట నీతపముమహిమ ॥భళిర॥ 60.

సీ. నీసహోదరులయి భాసిల్లు పెద చిన్న కృష్ణమూర్తులు భుజకీర్తు
లట్లు। బంధుమైత్రిని వీరగంధము శేషయ్య యుప్పుటూరు కోట
య్య యొప్పినట్లు। ధరశ్రీకొల న్వరదారెడ్డి మొదలయిన వారలం
గద ముఖ్యసిరులట్లు। బెజవాడహనుమంతు నిజసహాయము గల్గు
పంతమునకు హనుమంతునట్లు। యిన్ని గలిగిన జన్మము కేమికొ
దువ। యలరెజన్నంబు రామునియోగమట్లు ॥భళిర॥ 61.

సీ. నిన్ను దైవముబోలిచు నిక్కమన్నందుకు ఘనత నీ జేయుయాగం
బెసాక్షి। ఫైరులు నీకు విధేయులన్నందుకు న్యాయమహా నన్నదా
నంబెసాక్షి। దేవతుల్మెచ్చిరి దీనికన్నందుకు కృషి కనుకూలమహా
వృష్టిసాక్షి। సర్వదిగ్విజయంబు జరిగెనన్నందుకు ప్రకటితములగు
కానుకలెసాక్షి। యార్యవినుతికి నీహృదయంబెసాక్షి। యిదినిజం
బని యనుట కియ్యోలమెసాక్షి ॥భళిర॥ 62.

సీ. ఆర్యసన్నుతమైన యలబ్రహ్మవిద్యయే నీధనంబౌగదా నిక్కము
గను। సర్వదిగ్విజయైక సత్కీర్తికన్యయే నీదు కూతురుగదా ని
క్కముగను। పుత్రపౌత్రసమృద్ధి గోత్రుడైనఘనుండు నీసుతుడే
గదా నిక్కముగను। శాంతదయాదిక సద్గుణమణిగణ నీతల్లియే

గదా నిక్కముగను। నవ్యవేంకట లక్ష్మీసనాధనిన్ను। నిందునం
దును బొగడఁ తేవందిగణము ॥భళిర॥ 63.

సీ. అఖిలాండ కోటిబ్రహ్మాండ రాసులనెల్ల నొకరోమకూపమందుంచె
నెవడు। నతనికితాను శయ్యగనున్న జలధిపై నొకమూల నొప్పు
గానుంచెనెవడు। నతనినొకప్పుడు నమ్ములపొదిజేసి పంచాక్షరము
లందు బందునెవడు। నతడుతావక మానసాకృతి సద్భక్తతతికి
కోర్కెలొసంగితనుపుచుండు। నౌరనిన్నెట్లుజేతు కైవారమికను।
కమ్మకులమెల్ల నీచేతఖ్యాతిగాంచె ॥భళిర॥ 64.

శా. వాణీనాథ నిదాన మానసఘృణీవందారు మందారసన్మాణి
క్యోజ్వలమంజులద్యుమణి సామ్రాజ్యైక చింతామణీ
మానీంద్రస్తుతధోరణీ సదమలాత్మా నాత్మవిద్వద్గణశ్రేణీ
సింగము నేని సత్కులమణీ శ్రీరామయాజ్యగ్రణీ 65.

శా. రారాజుల్ భువి నల్లషోడశమహారాజుల్ భుజాశక్తిచే
మీరన్యజ్ఞము లెన్నిమోజరిపిరా మెప్పేలనీలాగు విద్యారమా
ఢీన్ ఘనయాగముల్ జరిపి శేధన్యాత్మవిజ్ఞాననుస్మేరా। సింగము నేని

శా. సారాచారమునీదు సౌమ్యమృదుసంచారం
బునీవిగంభీరంబెన్న భవద్వచోని యతిప్రా
వీణ్యంబునీవిద్య నీకారుణ్యంబ మృతాబ్ధియం
దురు బుధులైవారము ల్గావునుస్మేరాసింగము నేని 66.

శా. ఏయుక్తిన్నినుగెల్వ నెంచు బుధుడందేయుక్తి
మెప్పించునో యాయుక్తిన్మది నెంచి గెల్చెదవువిద్యా
ప్రౌఢిమగ్ర సద్యశశ్రేయోదాయకమైనవాక్కులను
వర్ధిష్ణుత్వమున్ బూనిలక్ష్మీయుక్సింగము నేని 67.

శా. ప్రాలేయాచల ధీరధీరచిత విద్యాసారసార
వ్రతాలోలత్రౌఢవిశాల శాలదమణీ
లోకైక లోకైక నిత్యాలంకార యశోధురం
ధరధరాసారైకసోల్లాసనం శీలాసింగము నేని 68.

శా. మందార ద్రుమకుంద శారదసుధా మర్త్యపరిభాస్వర్ధునీ
కందానందమరాళ పారదశరత్కంజాత నీహార
చిన్నందీశాద్రిభిదేభశంకరుల ప్రజ్ఞన్గెల్చునీకీ
ర్తిసద్బృందా సింగమునేని 69.

తే. గీ. కర్మమర్మమెఱింగిన ధర్మనిధులు
కర్మమోక్షమునకు త్రోవగాదనంగ
కర్మకైజాతిభేదంబు కావలయునె
సోమరులపల్కులన వె శ్రీరామయాజి

క. ఈలీల వేదశాస్త్రము। లోలిన్ గాలించిసార మూరించిననిన్ 70.
బోలుదు రెవ్వరు సద్వి। ద్యాలోలుడవౌర రామయాజివరేణ్యా.

క. అమరావతీశుడును శ్రీ। కమలానాథుడునుకీర్తి గని రేనినుబో
లినుహామహిమాఢ్యుడవీ। వమలిన సత్పుణ్య రామయాజివరేణ్యా

క. ఇహపరములుసాధించిన। మహిమన్గులవర్ధనతను మనుచుంటివినీ
పహ రాసిపాయిదైవం। బహహా సత్పుణ్య రామయాజివరేణ్యా 71.

క. గిరులెల్ల రజితగిరులై। పరిపూర్ణపయోధులెల్ల పాలకడలులై
బరగుభవత్కీర్తిని। శ్రీకరపుణ్యా రామయాజికారుణ్యనిధీ 72.

క. కమ్మకులముద్ధరించగ। నిమ్మహినరరూపమొందు నీశ్వరుడనుచున్
సమ్మతి బొగడుదురుబుధుల్। సుమ్మీ శ్రీరామయాజిసుగుణవిరాజీ

క. సీరీతియాగనిరతిన్। వీరుడునై సోమయాజి పేరొందినవారేరీ ధా
రుణి సత్యసుధీరుచి శ్రీరామయాజి ధీరవరేణ్యా 73.

క. నీవుధనధాన్యతతుల తపోవిభవంబు లనుపుత్రపుత్ర సమృద్ధిన్
శ్రీవర్ధిల్లుచునుండుము। శ్రీవర్ణితరామయాజి శ్రీగుణరాజీ 74.

క. ప్రతిసంవత్సరమునసీ। వతులితయజ్ఞములొనర్తు వనిగాదె
దయామతులై దివిజులొసంగుదురతులార్థములును రామయాజీనీకున్

సీ. తల్లిదండ్రులుగదా తనయులకనిపెంచు దిక్కనుకొనవచ్చు నిక్క
ముగను। నొకఋషి మిధునంబునకుసుత త్రితయంబు నందు మ

థ్యముని మధ్యమునిజేసి। నరమేధమునకీరె నరనాథునకుతొల్లి
వాడు విశ్వామిత్రువలన బ్రదికె। నతడె సునస్సేఫుడను ఋషి
యాగదా డిక్కుడై వంబని తెలియువలయు। ననుచునిజము నెరింగి
నయనఘమతివి। నిజమునీతో సమానుడు నీవుగదగ ॥భళిర॥ 75.

సీ. కొడుకుతండ్రికి దిక్కగునటన్న బ్రహ్లాదుచారిత్ర ఘననిదర్శనము
గాదె। తండ్రి యాజ్ఞానువర్తనత మాని చరించి తుదకు శత్రుని
చేత ద్రుంగజేసె। పుత్రుండుతండ్రికి శత్రుప్రశ్వాగోముఖ వ్యాఘ్రిం
బుగాడె యాపట్లననుచు। నెవనికెవ్వరుగారు యిహపరంబులకుది
క్కగుతాన తనకుగానాత్మనెంచి। నిజమెరింగి నటించెడినిపుణమ
తివి। నిక్కముగ తుల్యమననచ్చు నీకునీవె ॥భళిర॥ 76.

సీ. ప్రాణనాథుడుదిక్కు భార్యకునంటిమా ప్రాణేశు లేవురు ద్రౌప
దికిని। కురురాజుసభలోన కొప్పువట్టీడ్వింప వారింపజాలిరే పౌరు
షమున। మానసంరక్షణ మాధవుడొనరించి సభను రక్షించిన
సరణివినమె। గావునతనకుదాగాక యెవ్వరుదిక్కు తత్వంబెరింగి
నధన్యనిధికి।ననుచు ధీరత్వమున సోమయాజివైతి। వఖిలధర్మస్వ
రూపుడవనగ వలదె ॥భళిర॥ 77.

సీ. ఇలసోదరులు నెండ్రొరులు దిక్కటంటిమా వాలి సుగ్రీవులవర్త
నములు। రావణ కుంభకర్ణ విభీషణులమైత్రి తుదకు వారల దైన
దుర్వ్యసితి। యన్నలజంపించి యారాజ్యముల నేలు తమ్ములదుప్ర
వర్తనలుమదికి। రామాయణము నిదర్శనముగా దోపదే కాబట్టి
యాతుండు గానిదిక్కు! యితరులెవ్వరు దిక్కు గారెంచిచూ
డు। మనచునిశ్చయమెరిగిన యలఘుమతివి ॥భళిర॥ 78.

సీ. తనకులపత్నియే తన మనంబాగద తనజ్ఞానమేగద తనసుతుండు।
తనసోదరులుగద ధరజ్ఞానులందరు తనతండ్రియేగద తనగురుండు।
తనశాంతమేగద తనకామధేనువు ఘనతరానందంబు కల్పతరువు।
గరిమసుజ్ఞానులెగద బంధువర్గంబువైరాగ్యమేగదా వాంఛితంబు।

నత్యకైవల్యనిష్ఠయే నిత్యసుఖము। గా నెంచిగినపరమ సుజ్ఞానవిధివి ॥భళిర॥ 79.

సీ. వ్రతనిష్ఠబూనిన వానిడాంబికుడంచు శాంతంబుగలవాని జడుడటంచు। నాచారవంతుని నతులమాయావంచు శూరత్వనిధి దయాశూన్యుడంచు। శ్రోత్రప్రియాలాపుజూచి జారుడటంచు వరమానిగనిపిచ్చి వాడటంచు। పండితవర్యుని వాచాట నిధియంచు కార్యసాధకుతంత్ర గాడటంచు। సాధునింద యొనర్చుర సాధు లట్టి ధూర్తులనుమీటిమెలగు సత్కీర్తినిధివి ॥భళిర॥ 80.

సీ. జన్మదములగోత్ర సత్పితృవర్గంబు క్షేమంబు దెల్పుము చిత్రగుప్త। వారివంశజుడిల వైశ్వదేవము జేయ వారుస్వర్గము కేగినారు శమన। వారిబాంధవపితృవర్గమే మనుచుండె జెప్పుమా గుసగుసల్ చిత్రగుప్త। వారివంశజులును వైశ్వదేవము సేయ నారదుసంపుయత్నములుశమన। నియశోలక్ష్మి యిటువల్కు నీదునుషీమ। బగగుయమచిత్రగుప్త సంవాదమనుచు ॥భళిర॥ 81.

సీ. వరరత్నభూషణాంబర ధారులై యిప్డుస్వర్గంబునకువచ్చు వారలెవరు। వారుకోపోప్లుల వైశ్వదేవము సేయు నాతని పితృవర్గ మమరవర్య। నాతడాయింతలో నరకంబుదిగద్రొక్కి యిచటకే తెంచుట యెంతవింత। యదివైశ్వదేవమహత్వంబు గాదె పరాకోంది రోసహాసాకిమీర। లనుచు నారదుడిందుతో నునువ్పుదూక్తి నెల్లభువనము లభినుతియింతురి నిన్ను ॥భళిర॥ 82.

సీ. తనకు సింహాసనంబును వాహనంబు నూతనత నచ్చెనటంచు తమ్మిచూలి। తనకు విల్లును సెజ్జయును వేడ్కను లభించె ననుచు నానందించె నచ్చుతుండు। తనకు విహారాద్రి ఘనతురంగంబును నముకూరెనని మెచ్చె శంకరుండు। తనకునాయుధమును ఘనసింధు నమ్మెబ్బె। నభినవంబుగనంచు నమరవిభుడు। నీయశంబె నుతింతురు ారతమాత్మ। గౌరముతోడ నందిమాగధులపగది ॥భళిర॥ 83.

సీ. ?దమ్ములతారక సాంఖ్యామనస్క యోగములాటగీములై యమ।

గునీకు। సాధితవైరాగ్య బోధోపరతులసంగతులు వినోదసమ్మతు
లు నీకు।స్ఫుటతరకుంభక పూరక రేచకంబులు రాజవీధులై బో
ల్చునీకు।దృగ్వాక్స్పర్శల నెసు దీక్షాత్రియంబును నుద్యానవనము
లైయొప్పునీకు। నతివిధేయత సింహాసనంబు నీకు। నీశ్వరారాధన
ముపుట్టినిల్లు నీకు॥ భళిర॥ 84.

సీ. మానసపూజచేమను భక్తవర్యున కిలబహిఃపూజల వెందుకోరకు।
మనను మూలంబని కనుగొనుఘనునకు బాహ్యదేవార్చనే పను
లకోగకు। మనసుబ్రహ్మార్పణంబనుచున్న వానికి సగుణపూజనమే
మి జరుపుకోరకు। మనసునిర్గుణమని మర్మంబెరింగిన నీజగద్వర్తన
లెందుకోరకు। నాస్తికమతస్థులకు బోధనటన కొరకు। నడిపి నడి
పించుటయె నీదు నైజమహిమ ॥భళిర॥ 85.

సీ. శ్రీరస్తు విజయోస్తు స్థిరతరైశ్వర్యాభి వృద్ధిరస్తు అభీష్టసిద్ధిరస్తు।
శుభమస్తు జయమస్తు శోభనమస్తు సంతోషమస్తు సురేంద్రతు
ల్యమస్తు। ఆయురారోగ్య సదానందమస్తు విద్యాలాభమస్తు బ్రి
హ్మాయురస్తు। సర్వదిగ్విజయోస్తు సౌఖ్యమస్తు సమస్తబంధుజనై
క సంభావనోస్తు। సకలసంపత్కారోస్తవిసద్బుధవరు। లనుదినంబు
ను దీవింతు రభిమతముగ ॥భళిర॥ 86.

సీ. అతులలాభస్థితి నఖిలగ్రహాకృతి మాకుమారుడు బోచ్చు
మీకుమారు। సతతపరాక్రమ జయసిద్ధులొనగియు మాకుమా
రుడుబోచ్చు మీకుమారు। దీర్ఘాయురారోగ్య దీప్తులొసంగుచు
మాకుమారుడుబోచ్చు మీకుమారు। బలయుక్తులొసగుచు పది
యరదమ్ముల రాకుమారుడుబోచ్చు మీకుమారు। ననుచు దీవిం
తురి విబుధులు నవభృథంబు। స్నానమొనరుచుండిన సమయము
నను ॥భళిర॥ 87.

సీ. బుద్ధిమంతులునాజ్ఞ బద్ధులైసద్గుణ యుక్తులై తగియున్న సోదరు
లును। పతియాజ్ఞ కడుగుదప్పక యుపచారంబు దనిపెడి సత్కళ
త్రంబుమణియు। తల్లిదండ్రులయాజ్ఞ తలపైసిధరించి ప్రణతులైత

సుపుత్రరత్నములును। చెప్పినపనులెల్ల చేసిబల్మెప్పలు బడయ
జాలినయట్టి బంధువులును। దొరకుటకు నెంత జేసితో తొల్లితపము
గానిచో నేరికిట్టులు గలిగెనయ్య ॥భళిర॥ 65.

సీ. నీ ల్పినచోట్లు నిక్కమ్ముగ బ్రయాగ నైమిశారణ్యపుణ్యా వను
లను। నీయుద్యమంబులు నిక్కమ్ముగ బరోపకారంబులైన మా
ర్గంబులౌను। నీవాగ్విలాసముల్ నిక్కమ్ముగా వేద సారమ్ములమృ
త పుంజమ్ములగును। నీచరిత్రమ్ములు నిక్కమ్ముగా సన్మహర్షి చ
రిత్రంబులై చెలంగు। ననుచునుతియింత్రు సత్కవులనుదినంబు। నీ
తపఃపుణ్యఫలమిది నిక్కముగను ॥భళిర॥ 66.

సీ. నీకూర్మిగలమైత్రియే కదా ధూర్తుల కారుణ్య నిధులనుగా నొనర్చె
నీకరుణారసమే కదా మూర్ఖులఘనవిబుధ వరులగా నొనర్చె। నీక
టాక్షోన్నతియె కదా మూఢుల కవిచక్రవర్తులగా నొనర్చె। నీ
కౌతూహలంబె కదా జడులనుగాంభీర్య వనధులగా నొనర్చె। నిను
ము రసయోగమున నగు కనకమగుట। మహితమయ్యె భవన్మహా
మహిమాధరణి ॥భళిర॥ 67.

సీ. భిక్షార్థియొటకేగ వివరింపవేగారి బలియజ్ఞశాలకే పద్మగంధి।
లేడిపిల్లధరించు వాడెచ్చటని గౌరి యాపంది నెరుగుదువా ల
తాంగి। ముసలియెద్దెక్కుచు నుసలువాడెచ్చట పశువులుగాచెడి
వాడెరుంగు। సంజపొద్దుల గొండ్లిసలుపువాడెచ్చట నది జగన్మో
హినినడుగు తెలియు। ననుచులక్ష్మియు గిరిజయు నాడుచున్న।
హాస్యములు నిన్ను రక్షించు నహరహంబు ॥భళిర॥ 68.

సీ. యోగియో యఖిలవిరాగియో సువిలాసభోగియో యనుచు స
త్పుణ్యనిధులు। వీరుడో మహానియ శూరుడో నిగమసంచా
యనుచు ప్రజ్ఞాననిధులు। ఇంద్రుడో వాచాఫణీంద్రుడో టులే
పాంద్రుడో యనుచుసుజ్ఞానఘనులు। మిత్త్రుడో పరమాని ఘన ని
సుగుణచారిత్రుడో యనుచు సూరిజనవరులు। పృథ్వి వెరుంగ నిమె
ఋ సంచరించునపుడు। నిన్ను గని నన్నుతింతురు నిఖిలజ గోచర
నెంద

సీ॥ కంజాప్తుడీమేటి కాబోలు గాకున్న కమనీయపద్మహస్తములుగలవె కంజారియీతండు కాబోలుగాకున్న పృథుదరస్మేరచంద్రికలుగ వె। కంజాక్షుడీభోగి కాబోలుగాకున్న నిగ్రహానుగ్రహానియతిగ దె। కంజగర్భుడితండు కాబోలు గాకున్న చతురోక్తివరశాస్త్రవ్యాప్తులుగలవె। యనిబొగడుచుండురఖిల సజ్జనులునిన్ను। తీర్థయాత్రల మెలగెడిదేశములను ॥భళిర॥ 70.

సీ॥ చతురాస్యమేల్కాల్పి చదువులిచ్చినవాడు దివిజుల దృప్తిగ్గ దించువాడు। భూదారరూపంబు పొలుపుగాంచినవాడు బ్రహ్లాదవరదుడై బరగువాడు। వామనాకృతిభక్తవరులబ్రోచినవాడు భార్గవరాముడై ప్రబలువాడు। శ్రీరామచంద్రుడై చెలగుచుండెడువాడు బలభద్రవిఖ్యాతి నలరువాడు। బౌద్ధకల్క్యవతార సంపదల వాడు। నోపికనుబూసి రక్షించుచుండునిన్ను ॥భళిర॥ 71.

సీ॥ సరసంబుగనుపల్ల జడలపైచుట్టాలు పక్కాలు బూబులై ప్రజ్ఞమెరయు। చందువానభము మహాల్చీలు శశిరవుల్ గాలి జాడ్నాలియై గరిమదనరు। నురిగులు ఘోషక్కు బరగు హుష్షారుగా చోపుదార్లైనుర లేపుగుల్కు। వెన్నుండు నజుడును మన్నెగాండ్రయి గొల్వ నెండికొండ నవాబు వేడ్కమీరం। నీదుకోరిక లొసగుచు నియతిబ్రోచు। దసరుదావున్నృద్ధి నాచంద్రతారకముగ ॥భళిర॥ 72

సీ॥ నీదయకెలమినీకై దగునీదయనీజయంబునకుద్ది నీదుజయము! నీదానమునకెన నీదానమాగద నీశాంతికెనయగు నీదుశాంతి। నీబలంబు సమంబు నీబలంబాగద। నీప్రజ్ఞకునుతుల నీదుప్రజ్ఞ। నీదీక్షకెనయగు నీదీక్షయేగద నీనిజంబునకెన నీనిజంబు। నీదు కడిమి కెనయగు నీదుకడిమి। నీసమానుండు నిలయందు నీవెగదర

సీ॥ బుధ్ధళిర॥ 73.

లును। పెంది మేలరాగణనాధ తమ్ముడు చెవిగిల్లె సమ్మనూచు। త్రంబుమసరాస్కంద ఈమంకుచేష్టలు ముఖములు లెక్కించెమం.

— నక్షేల జేతువురా వినాయకనీవు పాడుగుముక్కనఁ

